# అంకితము

అన్న — చెలికాడును — గురుడును - మహాత్ముఁ డగుచు
నింత వానిఁగ ననుఁ గాంచి - యెంతొ మురిసి:
నన్ను మున్న డివిం జేరె చిన్ని యన్న
రామచంద్రన్న స్మృతి-కిది - లాంఛనమ్ము.

మహాకవి-కవితావసంతేత్యాది బిరుదాంచితులును,
శ్రీరాయలసీమ పరిషదధ్యక్షులును,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీసభ్యులును,
శివభారత గ్రంథకర్తలును అగు
శతావధాని

## శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి గారిచే.



'నీవు—నేను' కృతికి

అభినందనములు:



ఆయతపుణ్యరాశిఫలమ్మై కవితాలత పాదు లూర్చి తా
నై యుదయించెఁ; బెంచుటకునై పటుయత్నము లేకయున్నఁ దా
నై యిటు లేచి పూచెఁ; గృతిపై కృతికర్తవునైతి: సత్యనా
రాయణమూర్తి! నీయెడ సరస్వతి కెంతటిమక్కువో గదా!

కతయునుగాద, కల్పనయుఁ గా దొకవర్ణన గాద; యిష్టదై
వత మలకొండనుండి యిలపై నడయాడ మదిన్ విదిర్చి, యం
చితమగు పూలబాటను రచించితి-వార్ద్రిపదార్థభావనా
న్వితముగ, భక్తియోగరథనిర్భరయానము లుల్లసిల్లఁగన్.

"ఎంతటివానికైన ఫలియింపదు జన్మము-శాంతిలేక, యై
కాంతికభక్తి లేక, సుగుణాఢ్యత లేక, పరోపకారస
చ్చింతన లేక, ధర్మపరిశీలన లే" కని కంఠమెత్తి సి
ద్ధాంతము వల్కు నీకృతి యథార్థ మఖండమొ! ఖండకావ్యమొ

ఆసలు మీఱు నేర్చినది యాంగలభాషఁట! వృత్తియన్నఁ బో
లీసుల నేతవై విరతి లేకపరాధులఁ బట్టుటంట! యీ
వ్రాసిన కబ్బమన్న రసవత్కవితామృతమంట! యెవ్వఁ డ
భ్యాసము చేసితయ్య! జననాంతరపుణ్యముగాక, ధీనిధీ!

మెచ్చె లోకము, దేవుఁడు మెచ్చె నీదు
పూన్కి! సత్యనారాయణమూర్తి! యిట్లె
కృతుల శారదాదేవి నర్చింపుమయ్య!
ఆయురారోగ్యభాగ్యమ్ము లలరుచుండ.

ప్రొద్దుటూరు
6—4—1958

ఇట్లు.
గడియారం వేంకటశేషశాస్త్రి.



నంద్యాల మునిసిపల్ హైస్కూల్ ప్రధానాంధ్రపండితులు.

విద్వాన్, కావ్యతీర్థ

## శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రి గారిచే

'నీవు-నేను' అను గ్రంథమును గూర్చిన

అభినందనములు.

★ ★ ★

ప్రాయము రాకమున్నె యెగఁబ్రాఁకెడి భావమయూఖమాలికల్
పాయలు వాఱి హృద్గగనభాగమునన్ స్ఫురియించెఁ; గాని య
ట్లే యవి సాఁగియున్నయెడ నేమయియుండునో! మీఁద, సత్యనా
రాయణమూర్తి! యింతకును రంగము మాఱినదయ్యెఁ గైతకున్.

తీయని భావముల్ మనసుతీపిగ నుద్ధ్వనమైన వెల్లఁ బ
ద్యాయితధారతోఁ బ్రచురితం బొనరించితి రెల్లవార లా
ప్యాయన మొందఁ, గైత పరిపాకముఁ జెందఁగ; నౌట, సత్యనా
రాయణమూర్తి! సార్థకత యబ్బెఁగదా! కవితావిభూతికిన్!

శ్రేయము ప్రేయమున్ జగముచే ననుభావ్యములౌ విధానమే
ధ్యేయముగా నెసంగు భవదీయకరస్ఫురణల్ ఘనామృత
ప్రాయములై సమస్తకవి పాఠకభోగ్యము లయ్యె సత్యనా
రాయణమూర్తి! యక్షరపదార్థసమాకలనానుకూలతన్.

చిడిపిచేఁతల చిడిముడిపాటులే గాక
సరససభ్యత లేని సమయ మేమి?
నాస్తికత్వము మీఱి, యాస్తికత్వము నిల్చి
పోకడ లుడుగాఱు లోక మేమి?

ఐహికమ్మునె గాని యాముష్మికముమాట
    యెఱుఁగని యాంగ్లమ్ము గఱచు టేమి?
కఱకుఁదనమ్ము చిక్కఁగఁ బట్టు పోలీసు
    శాఖలో నున్నతస్థాన మేమి?

ఇట్టు లుండంగ నిన్నింటి నెట్టివైచి
మానవత్వము నిల్పుకో నూనినట్టి
చర్య లగుపడుఁబో మీరచనలయందుఁ
బూర్తి, సత్యనారాయణమూర్తివర్య!

కవితాసామ్రాజ్యము
నంద్యాల.
20—4—1958.

ఇట్లు
మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.



# కృతజ్ఞతాంజలి.

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్,
యత్కృపా తమహం వందే పరమానంద నిర్ఘరం.

విజ్ఞులారా!

నేను కవి నౌదామని యత్నించలేదు. నాకా ఆశకూడా లేదు.

వ్యాసవాల్మీకికాళిదాసులును, కవిత్రయమును, పెద్దనాది మహాకవులును సృజించిన కవితాప్రపంచములోని వింతలను-కొంతవరకైనా చూడని, చూచుట కవకాశములేని, నేను-నవ్యసందేశమే మివ్వగలను! నాకా అధికారమూ లేదు, లేదనే అసంతృప్తీ లేదు.

కాని-మానవుడుగా కొన్ని సుఖదుఃఖాలను చవి చూచినాను. పెద్దల ఆశీస్సులతో-దైవకృపతో, నాలోకల్గిన భావాలను ఛందస్సులో పెట్టగల్గినాను. ఏ భావాని కా భావముగా- ఏపద్యాని కా పద్యముగా చిందర వందరగా వుండినది. వీటిని ప్రకటిస్తామనే ఉద్దేశం కూడా వుండలేదు.

ఇంతలో-నాకు మార్గదర్శకులును, శ్రీకృష్ణభక్తులునూ అయిన మారెండవఅన్నగారు-శ్రీగోటేటి రామచంద్ర రావుగారు పరమపదించిరి. ఈ పుష్పగుచ్ఛమును వారికి అంకితమిచ్చు నభిప్రాయము మొగ్గతొడిగింది.

మా పోలీసుఆఫీసులో శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశాస్త్రి-ఒకసారస్వతపిపాసి-ఆంధ్రప్రదేశ్ అవతరణసందర్భమున "మహాంధ్రోదయం" (పద్యాలు) ప్రకటించినాడు. అది-నాకెంతో ఆనందం కల్గించింది. ఆ సహృదయునకు నా యీ రచనలను చూపెట్టినాను. వెంటనే అతడు-ఈ రచనలను గ్రంథరూపంలో ప్రకటించండని

ప్రోత్సహించడమే కాక-వాని నన్నిటిని ఒకచోట చేర్చి, శుద్ధప్రతి తయారుచేసి, చాలా వుత్సాహముతో, ఈ గ్రంథం ఈ రూపం దాల్చడానికి కారణభూతు డయినారు. ఈ పూలదండలో ఇతని కృషి-దారము వంటిది.

పెద్దవాణ్ణి కనుక-ఈ మిత్రుడు సర్వవిధాలా అభివృద్ధికి రావలెనని ఆశీర్వదిస్తూన్నాను.

కవితావసంతునితో నాకు ఇతఃపూర్వము పరిచయంలేదు. వారు సాదరంగా నా రచన విని, స్వయంగా చదివి, అభిమానంతో నన్నాశీర్వదించినారు. వారికి నా నమస్సులు.

కవిమహర్షి శ్రీ మద్దులపల్లివారు-సరసులు, ఉదారహృదయులు. నిండుహృదయంతో నన్నాశీర్వదించినారు. వారికి నా కేలుమోడ్పు.

ముఖచిత్రమును ఊహించి, భావించిన శ్రీ పాణ్యం సంజీవ శాస్త్రి L. L. B., గారికిని; ఆ భావనకు స్వరూపమిచ్చి-అందచందములతో నా రచన కలంకారము గూర్చిన శ్రీ కే. శ్రీరామమూర్తి (పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు) గారికిని నా అభివందనములు.

నా యీ చిన్నకృతికి-అఖిలాంధ్రములో పేరుగాంచిన కవులు దీవనపూలు కురిపించడమూ, సిద్ధహస్తులైన చిత్రకారులతోడ్పాటు లభించడమూ నా అదృష్టం.

ఇంతేకాక, పుస్తకాన్ని చూడముచ్చటగా ముద్రించిన శ్రీ దుర్గా ప్రెస్సువారిని, వారి కార్మికవర్గాన్ని హృదయపూర్వకంగా అభినందిస్తూన్నాను.

నంద్యాల
25—4—1958

విధేయుడు,
గోటేటి సత్యనారాయణ మూర్తి.

# ఒక మాట

"నీవు—నేను" కావ్యం చిన్నది. గుణభారం గొప్పది. దీన్ని గురించి వ్రాయడం నాకంత సులభమైన పనికాదు. మా పదవులలో ఎంత అంతరం వుందో (వారు. Dy. S.P. నేను Clerk. ) కవి గారికీ–నాకు వయసులోనే కాదు, విద్యా విజ్ఞానములలో కూడా అంత తేడావుంది. అయినా నా కీఅవ కాశాన్ని కల్పించి మున్నుడి వ్రాయమని ఆనతిచ్చిన ఆ ఉదార చరితునకు కృతజ్ఞుణ్ణి.

ఈ కృతి ఒక అపూర్వమైన శిల్పం. ఎన్నుకొన్న ఇతి వృత్తం ఎంత వుదాత్తమో ఉపయోగించిన ప్రతీ పదం అంత అర్థవంతం.

విషయ శీర్షికలనే గమనించండి!

"ప్రాతరుద్బోధం"తో జాగృతి చెందిన ఆత్మవంతుడు ఆప్రత్యూషపవనాంకూరములకు, తళ్కుతళ్కను తారలకు, భంగపాటున కోర్చికూడా శాంతి వీడని వార్ధిమేఖలకు ముగ్ధుడై పాంచభౌతికమైన ఈ సృష్టికీ – ఆసృష్టికర్తకూ "ప్రాంజలి" ఘటించి "ప్రార్థన" చేస్తాడు.

ఆసర్వ చైతన్యమూర్తి తనకు "ప్రియతముడు". దైనం దిన వ్యవహారాలలో ఇతడు "దైవబలమును" పురుషకార ముతో తూచి ఆంతర్యం అర్థంచేసి కొంటాడు. దాని పరిణా మమే "చిత్తశుద్ధి". అందువల్ల అహం నశించగా "సత్సాం గత్యం" లభిస్తుంది. అంతతో జీవితంలో ఒక "తృప్తి" యేర్పడుతుంది.

ఈ విధంగా పురోగమిస్తున్న ఆత్మవంతునికి కలిగే అగ్నిపరీక్షే "ఛాయాదేవత". సంయమన జీవనంవల్ల-ఏకాంతిక దీక్షతో సాధించిందంతా మహిమలు చూపడానికేనా? లేక, మరీ కొంతముందుకు వెళ్ళడానికా! ఈసాధించిన మహిమలతో లోకకల్యాణం సాధించడం మేలుకాదా! అలనాడు-ఆ సాధించిన లోకకల్యాణం అంతా తనకు గర్వకారణమయితే? అధఃపతనం తప్పదేమో! లోకకల్యాణం ఘటిల్ల వలసిందే. అది తన పురోగమనానికి అడ్డురాకూడదు.

ఆ సమన్వయం ఈ ఛాయాదేవతలో కన్పిస్తుంది. అంతేకాదు- గతానుగతికమైన యీ గుడ్డిలోకాన్ని యీ భాగం సున్నితంగా వివరిస్తుంది.

మహాత్ముణ్ణి వదలి ఆయన నీడను దేవతగా ఆరాధిస్తుంది - లోకం.

ఈ విధంగా పరిణతుడైన ఇతడిప్పుడు "స్థితప్రజ్ఞుడు".

ఇతడిప్పుడు నిరంతరం నిరంతరాయంగా "చింతనం"తో 'ఆత్మబోధ'తో కాలంగడుపుతాడు. పరాత్పరునికి "విన్నపం" చేస్తాడు. తన్ను తాను 'సమర్పణం' చేసికొంటాడు.

ఇట్టి ఉదాత్తభావపరిపూర్ణమైన యీ కృతి పేరు "నీవు—నేను". నీవునేను అనే మహావాక్యాన్ని స్ఫురింపజేస్తుంది. ఇందులో భక్తి (నీవు—పరమాత్మ; నేను—భక్తుడు) జ్ఞాన (నీవే నేను) యోగములు, వానిలో అంతర్లీనమైన కర్మయోగము చక్కగా ప్రతిపాదింపబడినవి.

ప్రసాదగుణభూయిష్ఠమైన యీ కావ్యమంతా ఒక మనోహరగీతం. హృదయతంత్రీస్పందనముతో రసానుభూతి నందించే యీ అమృతకలశంలో ఈ యీ పదార్థాలు (అలంకారములు, నుడికారములు మొదలగునవి.) సమ్మిశ్రితములైన వని చెప్పబూనుకొనడం ఆనందానుభూతికి అంతరాయమేమో!

ఇందలి భక్తికి అవధులు లేవు. ఏమతమువారైనా యీ భక్తిగేయముల నాలపించవచ్చు. అంతటను ఆ యా హృదయసీమానివాసులైన ఉపాస్యదైవములే కాన్పింపగలరు. 'సర్వజగదధిష్ఠాత్రై, నిబిడవ్యష్టి సమష్టి వెల్గు' ఆ అనంతశక్తియో ప్రత్యక్షమగును.

"ఏమతంబైన దేశ మదెట్టిదైన" భక్తిగేయం వింటే తనకు ఆనందమును ప్రసాదించమని కోరడమే వినయవినమితులైన భక్తుని ప్రార్థన. ఉరిని దీసెడువానిన్నైనను, ఉరికి దగులువానిలోనే గాక— వలపించు నీతిబాహ్యమయిన కులటాముఖంలోకూడా ఆపరాత్పరుని పరమమంగళరూపమును గాంచగలుగ నిచ్ఛయించు భక్తుని కన్న ఉదాత్తు డెవడు?

సర్వాంగసుందరమైన యీ మనోహరకావ్యమును ఫలాపేక్షారహితంగా ఆంధ్రలోకమునకు సమర్పించిన శ్రీ గోటేటి సత్యనారాయణమూర్తిగారికి పరాత్పరుడు పరమశుభముల ప్రసాదించుగాత మని ప్రార్థిస్తున్నాను.

నంద్యాల.
6—6—1958

విధేయుడు,
గొల్లాపిన్ని రామకృష్ణ శాస్త్రి.

# విషయ సూచిక.





# మంగళా - చరణము

శ్రీలఁ గుల్కియుఁ గటాక్ష మాలికల తోఁడ
శ్రేయ మొడఁగూర్చు నభయ ముద్రికను దాల్చి,
మందహాసంబు మోవిపైఁ జిందులాడఁ
గానుపించు దేవుండు రక్షకుఁడు—నాకు.

# ప్రాతరుద్బోధము.

కనుఁగొనా రాఁగ శుభోదయద్యుతి వెసల్ గ్రమ్మెన్ దమశ్ఛాయ లో
సరిలెన్-మేల్కొన వేల? నీయలసతన్ జాలించి; రారాజు పే
రు రహిన్ బాడుము కంఠమెత్తి యఘవిద్రోహంబుగా, నాత్మలో
గురువుల్ వారెడు ప్రేమనాకధునిలోఁ గ్రుంకంగ లేలెమ్మికన్.

చిరతర పాపతాపము నశింపఁగఁ, బుట్టువు సార్థకంబుగా
ననమున దక్కి యాతని పదాబ్జములం దల మోపి "హే కృపా
పర! శరణాగతోఽస్మి, పరిపాలయ మా"మ్మని వేఁడుకొమ్ము- పై
గనుపొడునంగ, నశ్రులు మొగంబునఁ గాల్వలు గట్టి పాఱఁగన్.

ఆతని సేలు చాటునటు లల్లవె పుల్గులు గెల్లు సెల్ల "సం
త్రాతకు, సర్వమంగళవిధాతకు జే" యని పాడుఁ దియ్యనన్:
గౌతుక మొప్పఁ బ్రాక్సతి మొగంబునఁ గుంకుమఁ దీర్చి- యద్భుతం
బైతగఁ బట్టుచున్న దదె - యారతి బంగరుపళ్లెరంబునన్.

నీ రూపంబును విస్మరించి, యకటా! నిస్సారసంసారఘం
బోగాముల్ కడు మెచ్చి, యచ్ఛపుధృతిన్ బోనాడి, యజ్ఞానవి
ద్యారాసిక్యసమగ్రపండితుఁడవై దర్పోద్ధతుండైతి: నీ
ఘోరంబౌ నలసత్వ మెయ్యెడల నీకున్ దాపురం బయ్యెనో ?

తగ దీనూంధ్యము-స్వాత్మఘాతుకము: నిద్రామోహివై, యక్కటా!
పగలం జిక్కితి; వీ యనర్థమున కెవ్వారున్ నిమిత్తంబు గా
రు: గతప్రజ్ఞుఁడ వౌట నీ సహజ సారూప్యంబె లక్షింపలే
క-గతిన్ గానవు: మేలుకొ, మ్మనఘ! సుజ్ఞానంబుఁ బాటింపుమా.

# ప్రాంజలి.

ఎవ్వాని శుభనామ మేప్రొద్దుఁ గీర్తించి
భక్తుండు సంసారవార్ధి దాఁటు,
ఎవ్వాని కర్పించి యెల్లకర్మంబులఁ
గడతేఱు ముక్తుఁడై కర్మఠుండు,
ఎవ్వాని పదపద్మ మెదలోన నెలకొల్పి
యఱకాల మృత్యువు నడఁచు- యోగి,
ఎవ్వాని తత్త్వంబు నేపాఱఁ జింతించి
యఘశోషణుండయి యలరు జ్ఞాని,

ఎవనిఁ బాడఁగాంచి-క్రీడింతు రెవనియందు
మునులు,సన్న్యాసులును; నట్టి ఘనుఁడు-పూజ్యుఁ
డప్రమేయుండు పరమేశుఁ డఖిలసాక్షి-
యనయ మిట నిల్చి బాసట యగుచు నాకు.

తులలేని నీతేనె లొలుకు పిల్పున కాసఁ
జేసి, పీనుల నొగ్గి గాసిఁ జెంది,
గతజీవులన్ జీవకళ లుట్టిపడఁ జేయు-
నమృత హస్తస్పర్శ మభిలషించి,
మూఁడులోకముల సమ్మోహింపఁజేయు నీ
మూర్తికై యనిమిషమూర్తిఁ దాల్చి,
వాచామగోచర ప్రాభవుం డగు నిన్ను
నుతిఁ జేయ గొంతెత్తి శ్రుతులఁ బాడి,

స్వాతి కార్తెకు వేచి విప్పారి యున్న
ముత్తెపుఁజిప్పవలె—మదిఁ బురులు విప్పి
కాచి యున్నాఁడ నీమృదు గానలహరిఁ
దృప్తునిగఁ జేసి యాశీర్వదింపు, తండ్రి!

తళ్కుతళ్కను లసత్తారకాగణముల
వీక్షింప నీచూపు విదిత మగును,
మందమంద సుగంధ మలయానిలంబు మై
సోఁకినంతనె యూర్పుసొబగు దెలియు,
ఘన ఘనాఘనముల గర్జనంబుల విన్న
గంభీరవాగ్ఝరీగరిమ వెలయు,
భంగపాటున కోర్చు వార్ధిమేఖల శాంత
మరయ నీయోర్పున కవధి తోఁచు,
నెచట నేకాలమం దెది యెట్లు కనినఁ-
దరళ విభ్రాంత చకిత చేతస్కుఁ డౌచుఁ
గాంతు నీదివ్యరూపంబు కన్నులార
భక్తతతి- యెంత వాత్సల్యపరుఁడవయ్య!

వచ్చియు గాని స్తనంబుల విన్నంత
నను రాగమునఁ జూతు జననిరీతిఁ
జెడు మార్గములఁ బట్టి చెడిపోవువేళల
దండించి మరలుతు తండ్రిమాడ్కిఁ;
గారింమ రోగాదికష్టపరంపరఁ
గను గల్గి నగ్రింతు కాంతజోకఁ;

గలగుండువడి దుఃఖముల మున్గి యుండంగ
వడివడిఁ జనుదెంతు కొడుకువోలె;

తల్లి, దండ్రియుఁ, బ్రియురాలు, తనయుఁ డగుచ
నన్ని దశలను విడువని యట్టి బంధు
వగుచు, గురుఁడు, మిత్రుండునై యరయు నిన్ను
గన్ను గానక కనుఁగొనకున్నవాఁడ.

నీస్వరూపం బెంత నిర్మలమో. కాని
భావింప నేదియుఁ బాలు వాము;
నిందాస్తుతుల కెంత నిస్పృహుండవో కాని
నిర్ణయింప మనసు నేర్వలేము;
నీదయాభరితహృన్నిలయ మెట్టిదో కాని
తలపోయ నెంతకుఁ దరము కాదు;
నీసృష్టి వైచిత్ర్యనియమ మేమో కాని
యరసి యూహింప సాధ్యంబె కాదు:
ఇంతకును నీగుణంబుల నేవిధాన
దేనికిఁ బోల్ప మన్నను దెల్లము గద
యద్ది నీసృష్టిలోననే యణఁగి యున్న
వస్తు వని! యేల నా కిట్టిపసితనమ్ము?

నీయాజ్ఞ జవదాఁటు నేరక కాఁబోలు
నుదధి యోపిక లేక హోరారు వెట్టు;
నీవు కల్పించిన నియతిఁ దప్పఁగ లేక
భానుఁ డలుక నెఱ్ఱవాఱుచుండు;

నీ విధించిన రీతి నింపుఁదనంబుఁ గో
లోవోయి విధుఁడు హిమాశ్రులను రాల్చు;
నీ శాసననిరూఢి నింగి నభ్ర ముఱిమి
వర్షించి స్నిగ్ధునఁ బాలిపోవు;
నయిన, విసువుల కలుకల కశ్రులకును
స్నిగ్ధన కొంకింతయేన్ మన స్వర్గకుండఁ—
దనయులకు—మాకు—సేమంబె తనరఁ జూతు:
భళిర! నీయుపాయ మాకుఁ దీర్పంగఁ దరమె?

గ్రీష్మాతపమ్మునఁ గీడ్పడు నొడలికిఁ
జలువ తెమ్మెరలచే శాంతిఁ గూర్చి;
మండు టెండలకుఁ గంపము నొందు ప్రకృతికి
వార్షికవేళ జీవనముఁ బోసి;
సీతుబాధకు నోడి చివికి యుండిన వేళఁ
దనియఁ జేయఁగ వసంతమ్ముఁ బఱపి;
తెరయెత్తి—తెరదింపి తీరున నాడింతు
సుఖ దుఃఖనాటికఁ జోద్యముగను—
భళిర! నీసృష్టికౌశలపరిణతికిని—
ననుపమ కృపాగుణంబున కంతు లేదు:
చిత్ర! మో జగన్నాటకసూత్రధారి!
సకలసజ్జనపథవర్తి! సాధుమూర్తి!

దిన మెల్ల రవి నిజదీప్తిచే జగముల
వెలిఁగించి తేజంబు వీడకుంట:
నిర్మలాంబువులను నిత్యంబు నొసఁగుచుఁ
దఱుఁగకుండ నదులు తరలుచుంట:
చల్లగాలుల సజస్రము వీచుచును వాయు
వొక్కింత బలమైన నుడుఁగకుంట:
సమయ మారసి జీవనము ధారవోసి పో
షించు మేఘంబు వర్షించుచుంట:

పంట పొలములఁ గన్నులపండు వగుచు
నెఱుక లేని కాలమునుండి పృథివి మనుట:
పాంచభౌతిక మైన యీ ప్రకృతి యెల్ల
నీకు లోఁబడియుంట కాన్పించు—దేవ!

దుర్నిరీక్ష్యప్రభల్ తొంగలించెడు రవి
వెలవెల్లఁబాఱు నీవెల్గు ముందు,
ప్రకృతి యంతయుఁ బరివ్యాప్త మగు నాకాశ
ముడివోవు నీవ్యాప్తి నుగ్గడింప,
ధవళాతి ధవళ సాంద్ర జ్యోత్స్నలను జిందు
శశి— కుంద నీకీర్తిఁ జాటు లేక,
నవకారు వలపూఁగు సవ్యశోభ లవెల్లఁ
దల వంచు నీచక్కఁదనము ముందు-

భళిర! నీసాటి లే రెందు—బహుళమైన
యీ చరాచరసృష్టియం దింత నిజము!

నిన్ను నీసృష్టితోఁ బోల్ప నెన్ను టెల్ల-
సూర్యునకు దివ్వెఁ జూపెడిచొప్పు కాదె?

పరమకృపావిశేషమునఁ బాయక యెప్పుడు మమ్ము సాకు దీ
వరమర లేక; నేను దిన మంతయు నాపనిలోన నుండిరా
తిరి నిదురించి నిన్ మఱతు; దేవ! యటయ్యును నన్ క్షమింతువే!
నిరవధికానురక్తి యన నీదె కదా! భవపాశమోచనా!

వారకొను శోభలన్ బ్రకృతితో నునుఁబచ్చని పెండ్లిపీఁటపై
ముఱిసెడు నీకు కాల మను ముద్దియ-కోయిలకంఠ మెత్తి తా
నరుణగభస్తిమాలికల నారతు లెత్తెడుఁ, జూడుమా! హృదం
బురుహము రేకు లెత్తఁగఁ-బ్రమోదమరందముఁ జిల్కరింపుమా!

# ప్రార్థన.

"Bless me, my beloved" (మా అన్న గారు కీ॥ శే॥ శ్రీ గోశేటి రామచంద్రరావుగారు, రచించినది) అను ఆంగ్ల పద్యమున కనువాదము.

ప్రకృతిలో నిన్నుఁ జూచెడు భాగ్య మబ్బి
నప్పు, డా నీదుమృదుదరహాసముఖముఁ
బోల్చుకొన్నప్పుడు తనువు పులకరింప-
కాల్వలై పాఱు ప్రేమాశ్రు కణము లుఱలి-
మునిఁగి పోనిమ్ము నన్ను సమ్మోదవార్ధి.

ఏ మతంబైన—దేశ మదెట్టిదైన
భక్తుఁ డేకాంతమున నీకు బంపుకొనెడి
భావగీతిక కాని, యవ్యక్త మధుర
కంఠమునఁ బాడు ప్రార్థన కాని, చెవుల
నొలికినంతనె హృదయమ్ము జలదరింప
నిమ్ము-కటిక చీకటిమెఱు పెసఁగురీతి.

ప్రభువతంసమ! నీతోడఁ బల్కునపుడు
భక్తివాహిని నామ రూపముల తటము
లొరసికొని, పొంగి, వరదయై పొరలనిమ్ము-
ప్రేమసాగర! నీలోనఁ బేర్మిఁ గలిసి
లీనమైపోయి కలరూపు లేక యుండ—

త్వల్లసన్నామపదమును పావనముగఁ
బంచమస్వరమున నన్నుఁ బాడనిమ్ము.

రాజితామోదచరణపంకేజయుగళిఁ
వ్రాలఁగనీయుము నా చూడ్కితుమ్మెదలకు.

జీవితము దుర్భరం బయి చెలఁగఁ, గష్ట
సముదయము పైకొనంగ, విచారభరము
క్రుంగఁదీయఁగ, సంసారఘోరరాత్రి
చుట్టు ముట్టఁగ, సర్వంబు శూన్యతఁ గన,
నీదు ప్రేమయె యూఁతగా నెగడ నిమ్ము.

ఉరిని దీసెడువానిని, నురికిఁ దగులు
వాని, హంతుని, హంతను, భయపడు మృగంబుఁ,
బైఁబడంగ నుంకించెడు భయదఘోర
సింహముఖమును, మృత్యునిశితకరాళ
దంష్ట్రిలను, బంజరస్థ పతంగ లోల
నేత్రయుగ్మము, నలపించు నీతిబాహ్య
మయిన కులటాముఖంబుఁ గనియెడునప్పుడు,
వేకువను, వృక్షశాఖల వీచు మలయ
పవన మృదు నిస్స్వనంబుల, భ్రమరగీతు
లల్లనం గర్ణపేయంబు లైనయపుడు,
మధురరసములఁ జిప్పిలు మంచిఫలము
లను జవిఁగొనునప్పుడు, వినుతయశులఁ

బూజ్యాలపదంబు లంటునప్పుడును నీదు
పరమమంగళరూప మేపారఁ గాంచఁ
గలుగ నిమ్మోయి!
అంతటఁ జెలఁగుకతన
రెంటఁ బ్రేమస్వరూపివో తేఁజ నీవ-
చేతనాచేతనంబైన సృష్టి—మూర్తిఁ
దాలిచి పరోక్షముననో ప్రత్యక్షముననో
జగము లలరించుచుందు ఇచ్ఛావిభూతి.

సంధ్యలను-బర్వతాగ్ర ప్రశస్తతలము
స్వర్ణకాంతుల నీనెఱ సమయములను-
గగన మొకవంక భూమిని గలిసి ముద్దుఁ
గొనెడు నదనున—వెదఁజిమ్ము కోటికోటి
రోచులఁ గాంచునప్పుడు నోచుకొందుఁ
గాక నీనేర్పుఁ గని నిన్నె కలసిపోవ!

ఎన్నఁడేనియు నీజగ మెఱుఁగలేని
కళలకున్ దల్లి నీ వని తెలిసికొందు.

ఏను మూఢుఁడఁ: గాకున్న నెన్నిమాఱు
లంతమే లేని నీప్రేమ నింతె యింతె
కోరుదునె?— రాజరాజును జేరి యొక్క-
గాజుపూసనె యర్థించుకరణి దోఁప.

కాన దయచేయు మీ వరదాన మొకటి:
ఒక్కమాఱుగ భక్తిని జొక్కి, సతము
నీదుకరుణాతరంగిణి నీఁదు లాడి,
శాంతిజలముల స్నానంబు సలిపి, దివ్య
తేజమున లీనమై పోవ-
దేవ! మదిని
గెరలు సంతోషమున దివ్య కీర్తనములఁ
బాడఁ గన నిమ్ము! వెతలఁ బాపంగ రమ్ము!

ఓ మహాశిల్పి! విశ్వమహోదయమున
కద్భుతానంతరచనల నలవరించు
దిట్టవుగదోయి! నామెదఁ దీర్చి, దిద్ది
నన్నుఁ జిత్రింప ర మ్మేల; కన్నడింతు?—

ఓ జగన్నేత! గురువర! యో పవిత్ర
మూర్తి! నెచ్చెలి! యెనలేని యార్తిఁ జెంది
దిక్కు నీవంటి నాశీర్వదింపు మోయి!—

కనులు మూసితి; నీకృపాకలితదృక్కు
లను మరల్పకు; తెరచినఁ గనెదఁగాక
మోహనంబైన నీదివ్యమూర్తి మఱల-

  

నిన్నె యర్చింతుఁ- బ్రియతమా! నిన్నె గొలుతు.

# ప్రియతముఁడు

ఆలుబిడ్డలు తుదకు నా యనుచుఁ జెప్ప
కొనఁగఁ దగువారు లేక—పైకొను జరాప్ర
కోపతాపంబులకు లొంగి, క్రుంగిపోయి,
నిలువ నీడయుఁ జుట్టుకో వలువ లేక—
చివికి, జీర్ణించి- యాఁకటిచిచ్చుపెల్లు
చేత నింటింటికిని బొట్టఁ జేతఁ బట్టి
"పట్టెఁ డోగిర" మని గుండె బిట్టు వగుల
గేస్తుల యసభ్యతా తిరస్కృతులఁ దగిలి
వీథిఁ బడిపోవు నా నిఱుపేద పక్షి
యలసి సుడివోవకుండఁ దా నండ యగుచుఁ
జల్లని కరంబులన్ దేర్చి శ్రమము వాపు
నాత్మబంధువు—రక్షకుఁ డతఁ డెవండు?
నిండు కృపవాఁడు—దీనావనుండు గాక!—

మోవిపైఁ జిఱునగవులు మోసు లెత్తఁ;
జల్లనైన చూపులఁ—దేనె జల్లు కురియు
పలుకుల—నజాండగోళముల్ పులకరింపఁ:
జరణదాసులఁ దరిఁజేర్చు తరుణ మనుచుఁ
బాదవిన్యాసమునఁ దడఁబాటుఁ దెలుపఁ:
దరలి వచ్చెడు పరమసౌందర్యమూర్తి—
యెవఁడు కానోపు—నా మనోభవుఁడు గాక!

మిన్నేటి తరఁగల మిసమిసఁ బురుడించు
మృదులతనూకాంతి మెఱయుచుండ;
నరవిచ్చినట్టి క్రొవ్విరి యనూనాచ్ఛప్ర
కాశ మెల్లను హాసకళలఁ దేర;
నరుణునిలో రాగ మంతయుఁ బనివడి
కరపాదముల కూడిగములు నెఱప;
వీణారవంబుల వితసేయు పలుకులు
వీనుల నమృతంపు సోనఁ గురియ;

మూఁడు లోకాల మురిపించు మూర్తిఁ దాల్చి,
పరమసేవ్యుండు-నా భావి భాగ్యరేఖ-
నన్ను మనసార మెచ్చి, ప్రసన్నుఁ డగుచు
నుద్ధరించుట కదె వచ్చుచున్నవాఁడు!

ఫురుడింపన్ దనుకాంతి మొల్లమయి దిక్పుంజంబులన్; గర్ణని
ర్భరస్మై-దుర్జనహృద్విదారక రథధ్వానంబు మిన్నంద;- వి
స్ఫురదబ్జారుణలోచనద్వయి కృపాపూర్ణంబునై వెల్గఁగా
నరుదెంచెన్-రథినై ప్రభుండు: కనుఁడీ! యర్పింపుఁడీ. కానుకల్

దిక్కులు పిక్కటిల్ల నినదించె నదే జయభేరి; నాథుఁ డి
ప్రక్కకు వచ్చు: భక్తిని నుపాయన మీయుఁ గరండు! స్వామి- స
మ్యక్కరుణాంతరంగుఁడు: దయన్ మిముఁ దత్ప్రియకోటిఁ జేర్చెడిన్
ప్రమోక్షుఁడు-లెండు! శాంతిసుఖముల్, సఖులార! యనుగ్రహించెడున్.

  

నీకయి విశాల మొనరించి నెమ్మనంబుఁ—
గోర్కెల నణంచి, నినుఁ గాంచు కోర్కెఁ దగిలి
కాచుకొనియుంటి-నెన్నాళ్లో కఠిననియతిఁ:
గదలి రావోయి! ప్రియతమా! కరుణ గలిగి.

మురియుచుందును నీవు ముం దెన్నఁడో వచ్చి
వలపూరఁ గౌఁగిటఁ బట్టె దనుచు;
కులుకుచుందును నీవు కూర్మి దైవారంగఁ
బ్రణయగీతంబులఁ బాడె దనుచు;
పలవరింతును నీదు పాదపద్మము చెంతఁ
దా వ్రాసంగెద నంచుఁ దలఁచి తలఁచి;
వడి యూర్పులం బుత్తు వచ్చి, మెచ్చియు, శుభా
శీస్సులఁ బల్కి రక్షింతు వనుచు;

ఏమొ! యెప్పుడో—యెట్టులో—యెఱుఁగఁ గాని
చిత్త ముత్క్రాంత లూఁగ, నైచేష్ట లుడుగ-
నీదు వలపులె సతతంబు నెలవుకొనఁగ
మునిఁగి తేలుచు నుందు సమ్మోదజలధి.



# దైవబలము

కల దొకపట్టణం బిలను గాంచనదేవపురంబు నాఁగ న
త్యలఘుసమస్తసంపదల కాస్పదమై: నిజదర్పవహ్నికిన్
లలిఁ బరరాజులన్ బదతలంబునకున్ గొని తెచ్చి, హెచ్చి, త
న్నెలమి భజింపఁగాఁ బ్రజ: దినేశ్వరుఁ డేలెను దాని మేటియై

బాహుబలశాలి, ధీబలపరిణతుండు,
సకలశాస్త్రార్థవేత్తయై సాధుసేవ
నమున కలరును: గాని యనంత దైవ
శక్తిఁ గనఁ జూచు-నతఁడు విశ్వాస మెడలి.

అటుపయిఁ గొంతకాలమున కప్పురి కిర్వురు భూసురోత్తముల్
కుటిలదరిద్రదేవతకుఁ గూరుచు మోములఁ గాంతిఁ దక్కి లో
నటమట దేవురింప నట యాచనఁ జేసికొనంగ వచ్చి: రెం
తటి ఘనులైన నాఁకలికి దాసులుగాఁ జరియింత్రు కాదొకో!

అనుదిన మిర్వురు భిక్షా
టన కేఁగుచు నుందు రచ్చటం గల ప్రతిసా
దనమున: నప్పుడు వారి
య్యనువున యాచింత్రు కరము నాశ్చర్యముగాన్.

ఒకఁ డను "దైవసహాయం
బొక యింత యొసంగు మమ్మ! యోగిర" మని, వే
ఱొకఁ డను "మానుజసహాయం
బొక యింత యొసంగు మమ్మ! యోదన" మనుచున్.

ఇరువురరీతులం గని దినేశ్వరుఁ "డీశ్వరశక్తి యేమి భూ
సురున కొసంగు? నయ్యదియుఁ జూత" మటంచు చొక గున్నుషిన్ మఁజుల్
నెఱపి యొసంగె మానవుని నెయ్యముఁ గోరెడువానికిన్—బరా
త్పరుని విచిత్రచర్యలను భావన సేయఁదరంబె యేరికిన్?

అందలి రహస్య మెఱుఁగక యా ద్విజుండు
నింటఁ గూశ్మాండములు పెక్కు లుంటఁ జేసి,
తనదు నిర్భాగ్యదేవత తన్నుచుండఁ
బ్రథమునకు నిచ్చె దాని నుపాయనముగ.

అది యెఱింగిన భూపాలుఁ డాత్మఁ దెలిసె
"దైవబల మెక్కుఁ; డెంత నిర్ధనుఁడుఁ గాని
ధనదుఁ డయ్యెడు దైవంబు తలఁచినంత:
వానికృపలేని బలము నిష్ఫల" మటంచు.



# చిత్తశుద్ధి

హైందవకులప్రదీపకుఁ; డర్థిలోక
కల్పవృక్షంబు, శాత్రవకంటకంబు
నగు శివాజీ మహాప్రభుఁ డవనిభరముఁ
దాల్చి, పాలించెఁ బ్రజలను దండ్రివోలె.

అతని కతండె సాటి యగు-నాత్మమతోద్ధరణైకదీక్షకున్,
హిత మిత సత్యభాషలకు, హృద్యగుణంబుల, కార్తరక్షణో
చితికి, విదీర్ణ భారత విచిత్ర సమీకరణోద్యమక్రియా
చతురత, కాహవప్రథితసాహసవృత్తికిఁ, జిత్తశుద్ధికిన్.

ఆతని ధర్మతత్పరత, కాహవధైర్యగుణప్రశస్తికిన్,
నైతికవర్తనంబున, కనాగతవేది సమర్థదేశికుం
డై తగు రామదాసుని పదాంబుజసేవయె మూలబంధ మాఁ:
బూతచరిత్రుసేవనము పొంపిరివోవుట యెందుఁ గల్గునే?–

ఆ రామదాసుఁ–డతులగ
భీరుఁడు, మేధావి, విమలవృత్తుఁడు, సారో
దారుఁడు, మహిమోపేతుఁడు,
శ్రీరామపదారవిందసేవారతుఁడున్.

తఱచుగఁ గానలం దపము ధ్యానము సల్పుచు నంతరంగమం
దరసి పరాత్పరుం గను కృతార్థుఁ డతం: డటులయ్యు సంసృతిన్
దరణము గానరేక పలుతాపములన్ వెతఁ గుందు మానవో
ద్ధరణకు నెన్నఁడోచను నుదారచరిత్రుఁడు రాజధానికిన్.

ఆగతి నేఁగుదెంచెను మహాత్మ్ము స్వయంబుగఁ దోడితెచ్చును
ద్యోగమునన్ బ్రభుం! డవనతుండయి దండము వెట్టి, రాజ్యతం
త్రాగమసంగతు ల్వినిచి, యన్నిట నాతనిఁ దృప్తుఁ జేసి, యెం
తేఁగినఁ బాదచారియయి యేఁగుచు వెంట, సపర్యఁ జేయుచున్.

పురమునం దెంతకాల మప్పరమయోగి
విడియు నందాఁక నతనికి విహితవృత్తి
సేవ లొనరించు: నట్టి సచ్ఛీలమతికి
దేశికారాధనము కాదె తీర్థసేవ?

నరపతి యావిధాన ముని నాఁచికొనన్ బురవాసు లెవ్వరున్–
దొర సహింపఁజాలఁ డని దోహలు లయ్యును, భిక్షసేయఁగా
వెఱతురె కాని–యాతఁ డటు వేరె తలంపఁడు: సజ్జనాళికిన్
గురుపదభక్తి యెంతయును గూర్తురుగాక పరాయివారలే?

ఐనను రామదాసుఁ డట నచ్యుతభక్తిరసాభిషిక్తుఁడై
పూనిక "దాసబోధము" నపూర్వగతిన్ వినిపింపఁ దన్మహో
ఖ్యానవిమోహితాత్ములయి, యచ్చటివారలు ప్రేమతోడ నా
హ్వానము సేతు రాతని– గృహమ్ములకున్ బదపూజ సేయఁగన్.

సమర్థసచిత్తుఁడై సకలసత్త్వములం దనవద్యుఁడైన య
వ్విమలుఁడు బేద సాద యను భేద మెఱుంగక యెల్లవారికిన్
బ్రమద మొసంగుఁ దత్కృతసపర్యలఁ గైకొని: యెందుఁ జూచినన్
దమమున ద్వంద్వముల్ గెలుచు ధన్యుల కిట్టి విభేద ముండునే?

ధరణీనాథుఁడు కర్ణుఁబోలి, పెలుచన్ దానక్రియాశౌండుఁడై
పరగన్-లేమికిఁ దావు లేమి-నతఁడై ప్రౌఢత్వముల్ బాసి, జ
ర్జరితాంగంబున నుండె నొక్కెడ ననన్ సత్త్వంబుఁ గోల్పోయి త
త్పురకోణంబునఁ-బేదరా, లొకజరావ్యాధాత్మ జీవించెడిన్.

నిజముపేద యయ్యు నాయమ
యొరులకుఁ జే సాచ: దెంత యోగ్యత! కరుణా
పరు లెవ్వరైనఁ దామై
యరితి నొసంగన్ గ్రహించి యాదట వోవున్.

కుడువ నేమియు లేక కుందఁ బోవదు కాని,
యాఁకొన్న యితరుల కడలు మిగుల:
మెయిఁ గప్పుకొన వస్త్రమే లేక కుములదు
వస్త్రహీనలఁ గాంచి వసటఁ జెందు:
నిలువ నీడయె లేక నెగులుఁ బొందదు కాని
యిలు లేని వారికిఁ గలఁగు మదిని:
ఏదిక్కు లేక తా నింతయు దిగు లొంద,
దాశ్రయ హీనయా ననఘ కేమ్చు:

తనదుదుస్థితి కావంత తలఁక కొరుల
దైన్యభావంబునకు మదిఁ దల్లడిల్లు-
దైవచోదిత మేరికిఁ దప్ప దనుచుఁ
దెలిసియును గూడ దయ లోనఁ దెరలుకొనఁ

పరహిత మొందు దక్కఁ దన భావమునం దితరార్థకల్పనా
స్ఫురణ మె లేని యా నియతబుద్ధికిఁ దోఁచు నితాంతభక్తిత

త్పరుఁడయి, పామరత్వ మెడఁబాపఁ గడంగిన రామదాసు శ్రీ
చరణము లంటి, భిక్ష నిడి సత్కృతిఁ జేసెను వాంఛ యొక్కఁడున్.

కోరిక యీరికెత్తినను గూఢముఁ జేసెదఁ గాని పిల్వఁగా
నేరదు భిక్ష కాతని వినీతు లనేకధనాఢ్యు లిచ్చు స
త్కారము లాఁక వెట్టి తనదాయముఁ జేకొనడన్నఁ శంక: ని
స్సారములై నశించుఁగద—సాగెడు కోర్కులు పేదవారికిన్!

అతఁ డంతర్ముఖుఁ డౌట నాయమమనోవ్యాపారముల్ పోల్చి, కాం
క్షిత మీడేర్పఁగ నొక్కప్రొద్దు కరుణాచేతస్కుఁడై యోఁగెఁ, ద
త్ప్రీతి కాహూతుఁడు కాక యే: యివి కదా శిష్యుల్ మనింగోరు వాం
ఛితముల్ గూర్చువిధంబెఱింగి గురువుల్ చేయూఁతగా నిల్చుటల్!

వచ్చెడు నాయతిప్రవరువైఖరి కద్భుతమోదచిత్తుఁడై
హెచ్చినభక్తితోడ నెదురేఁగి, పదంబుల వ్రాలి, యర్ఘ్యముల్
చెచ్చెర నిచ్చి, యుబ్బెఁ—దనసేవకు సత్ఫల మబ్బె నంచు: నే
పొచ్చెము లేనియిట్టి గురుపూజకు నెద్దియు సాటి వచ్చునే?

వెరవున సేవలం దనిపి, పెన్నిధి యబ్బిన పేదమాడ్కి ని
ర్భరపరితోషణంబునఁ గుఱుంగట నిల్చినఁ—దృప్తి మోదసం
భరితమనస్కుఁడై యతఁడు "బ్రహ్మపదార్పితచిత్తుఁడై పొరిం
బొరి సమయంగఁ గర్మ, మనఁ బొమ్మని దీవన లిచ్చె నంతటన్.

కవియం బాతడి కోర్కెతో 'భవతి! భిక్షాం దేహి!' యంచుఁ వచిం
ప, వడిఁ స్తబ్ధత పిడి, విందునకు సంభారంబులన్ గూర్పఁ జే
యనగా నుండినయింటి కాపె చనఁబో–రోధించి ద్వారంబునం,
దనపత్యం బిది–యప్పుఁడీయఁ జన: దీయాతిథ్యముల్ కూర్చునే?

అని తనపూన్కి–వో నడుప, "నక్కట! యేమిట సత్కరింతు నీ
తని?–గజినయ్యెఁ గాసునకుఁ; దండులముల్ సరిపోయె; నప్పుఁడే
జనఁదను నీతఁ; డిప్పుడల సంకట మయ్యెను భిక్షసేయ; నె
వ్వనికిఁ దపింతు, నాతఁ డిటు వచ్చియు నిష్ఫలమయ్యె వాంఛయున్."

అని యసహాయతన్ బొగులు నాపెయవస్థకు జాలిఁ జెంది, మె
ల్లన దరిఁ జేరి, "యిట్టు లడలం బని కల్గునె? కల్గినంతలో
ననె సమకూర్పు మేదొ: కననౌ నదె తుంబిఫలంబు; చూడు! దా
నినె పచనం బొనర్పు–మది–యించెడు మా కిట విందు పొందికన్.

అనవుడు వేగ లేచి, గురునాజ్ఞగ దానిఁ దలంచి, తిక్తమై
నను దననేర్పు మీఱఁ బచనం బొనరించి, మనస్కరింపకే–
యనితరబుద్ధితో ననఁటియాకున వడ్డనఁ జేసె దాని– న
య్యనఘుని నారగింపు మనె; నంత నతం డతిమోదితాత్ముఁడై.

రసనా! యెన్నిరసంబులన్ మెసవినన్ రక్తిం గనంజాలు: వీ
పసయూ భోజ్యము నారగింపు మను చాపల్యంబునన్ మెల్లఁగా
మెసవెన్ బత్రముతోడఁ దత్సకలముఁ: బెల్లుబ్బి చిత్తంబు–నై
వసమున్ దప్పఁగ వ్రాలె–నాతనిపదాబ్జప్రాంతమం దవ్వియున్.

సరగునఁ గ్రుచ్చి యెత్తి 'గుణసంపద నీ కెవరీడు వత్సు? రీ
వెరవున నెవ్వ రీసరికి భిక్ష యొనర్చిరి? నేఁడు దొట్టి మ
ద్గురుసము రాలిగా నెఱిఁగి కొల్చెద: నే నికఁ బోయివత్తు' నం
చరిగె నతం: డెఱుంగరు గదా మహనీయులదివ్యచిత్తముల్!

రామచంద్రుఁడు తొల్లి యరణ్యమందు
శబరియాతిథ్యమును బొంది సంతసించె:
రామదాసుఁడు—నేఁడు పురంబులోనఁ
బేదరాలింట నతిథియై-ప్రీతుఁడయ్యె.



నీప్రశ్న సంస్తవనీయమహా: నది యేల
　　యందువా? సత్సంగ మలవడక యె
నను జేరు కొంతటికైనను గాదు:
　　సత్సంగమునను నిస్సంగి యగును:
నిస్సంగి యగువాఁడు – నిర్మోహి, నిశ్చలుఁ
　　డగుట జీవన్ముక్తుఁ డగునుగాదె?
అద్భుతంబుగ నీకు నద్దానిమహిమంబు
　　ప్రత్యక్షముగఁ జూపవలతు: నిటకు

రెండు క్రోసులదూరాన నుండుఁ బెద్ద
మఱ్ఱి యొక్కటి: దానికొమ్మలను మిగుల
నుత్సహించుచు నాడెడు నుడుత యొకటి-
తోడియుడుతలతో జతఁగూడకుండ.

ఆచిక్రోడము చెంతకుఁ జనుము - లోకాతీతమై యుంట-నీ
వే చక్కంగ నెఱుంగనేర్తు: వటపై నద్దానిసత్సంగమ
శ్రీచారిత్రము నెల్లలోకములకున్ శ్రేయోర్థియై తెల్పు, శి
ష్టాచారా!" యని శౌరి వల్క, మదిలో నమ్మౌని శంకించుచున్

"చోద్యమయ్యెడు నిది! యెటఁ జూచితిమొకో
ఉడుత సత్సంగమహిమమ్ము నుడువ!-నైన
నిం దొకరహస్య మేదేని యిమిడి యుండుఁ;
గాన హరిపంపు సేయుట కార్య" మనుచు.

చని యటఁ జిక్రోడంబును
గని, ముని తనవచ్చినట్టి కార్యము నెఱిఁగిం
చిన నయ్యది వెనువెంటనె
యనిమిత్తము యసులఁ బాసి యవనిఁ ద్రావెఁ.

అంత నారదుఁ "డిది యేమి యద్భుతంబు!
ఉఱక నుసురులఁ బాసె నీయుడుత: కృష్ణుఁ
డేల కల్లలు వల్కు?– నిట్లేల నాకు
శ్రమముఁ గల్పింపఁ జూచు నిష్కారణంబ?"

అని తలపోయుచున్ మఱల నచ్యుతుపాలికి వచ్చి, తాఁ గనుం
గొనినది చెప్పినన్ మొగము కోమలహాసరుచిఁ దలిర్ప, నా
తనిఁ దిలకించి, శౌరి "యిటు దైన్యముఁ జెందుట మిమ్ముఁబోంట్లకున్
జనునె? తలంచినంతఁ గొనసాఁగినదాఁక విడంగఁ జెల్లునే?

అగుట నీచక్కి కిపు డేఁగినంతదవ్వు
చనుము; పొడఁగాంతు వొక్క కాసార మచట:
దానిచాయనె కల్గు నుద్యానవనము;
నదియు బహుఫలపుష్పసంపదలఁ బొదలు.

అయ్యుపవనాంతరమ్మున నామ మొండు
వెలయు; సద్గానిశాఖకు వ్రేలుఁ బైఁడి
పంజరం; బందుఁ గల దేఁడువన్నె లొప్పు
చిలుక; యది తెల్పు సత్సంగఫలము నీకు."

అనినన్ వింతయు సంశయంబు మదిలో నౌత్సుక్యముం బెంపఁ-
య్యాన నచ్చోటికిఁ బోయి, మౌని తనకార్యం బెచ్చరింపంగఁ—జ
ట్టనఁ బ్రాణంబులు వాసె నాచిలుక: "కష్టా! యేమి పాపంబో! న,
గనినంతన్ మృతిఁజెందె నిద్ది" యని వేగన్ గృష్ణుసాన్నిధ్యమున్

చేరఁగాఁ జని ముని దీనిఁ జెప్పినంత
వినయ మొప్పంగ హరి వాని ననునయించి—
పావనుఁడ! యింక నీ కిట్టిభంగపాటు
కలుగ నేరదు; వోడ రేపుఁ గార్యసిద్ధి.

రఘుకులప్రభువుల రాజధాని నయోధ్యఁ
బాలించు నొకపుణ్యశీలుఁ డిప్పు;
డతనికి జన్మించు సుతుఁ డొక్కఁ; డాదిన
మాబిడ్డ నడిగిన నతఁడు తెల్పు
సత్సంగఫల మని శౌరి వాక్రుచ్చిన
నౌర! నాపై నిట్టిభార మేల
నిడె?—నన్నుఁ జూచి యాబుడుతఁడు మసిసిన
నీకుఁ జెప్పవలెనె నాసుకృత? మైనఁ
బ్రభునిముదలను నెరవేర్పఁ బాటి; గాన
నిపుడె యేఁగెదఁ దత్పురాధీశుఁ జూడ
ననుచు సురమౌని వెడలి యొయ్యన నయోధ్య
కొక్కత్రుటిలోనఁ దాఁ జేరె నక్కజముగ.

అతఁడటు వచ్చినఁ గని ధరాధిపుఁ డెంతయు సంతసించి-యం
చితముగ నర్ఘ్యపాద్యములచేఁ బరిపూజితుఁ జేసి మ్రొక్కి-"రాఁ
గతమును దెల్పినఁ గడిఁదికర్జమ్మునైన నొనర్తు వేగ, నా
నతి యిఁకు" మంచు వేఁడుకొన నారదుఁ డాదర మొప్ప నిట్లనెన్.

జననాయక! నీ కిప్పుడు
జనియించిన బిడ్డ నొక్క-సంప్రశ్నము సే
యన యే నేతెంచితి న
న్యునకున్ సాధ్యంబు కాదు నుడువఁగ దానిన్.

అనిన నాశ్చర్యమునఁ దోఁగియును విభుండు
సుతుని గొనిరాఁగ దాది కానతి యొసంగె;
నాబిడయు-దల్లి పొత్తిళ్ళయందు నునిచి
పంచిన ని సుంగుఁ దెచ్చెఁ దాపసునికడకు.

స్మితముఖుఁడైన యానిసువుమేనుఁ గరంబునఁ దాఁకి "సాధుసం
గతికి ఫలమ్ము నీవ పలుకన్ దగునొజ్జ వటుం జెటింగి వ
చ్చితి నినుఁ జూడ, నోచిఱుత! చెప్పవె!" యన్న మునీంద్రుఁ జూచి,య
ద్భుతమగురీతి నాబుడుత పొంకముగా వచియించె నీక్రియన్.

"మునినాథ! మత్పూర్వపుణ్యవశంబునఁ
బడసితి నిన్ గాంచు భాగ్యగరిమ:
మునుముందు వటవృక్షమున నున్న యుడుతగ
నినుఁ జూచుకారణమునఁ బులుంగు
నైతిఁ: గ్రమ్మఱ నీవు నవ్యాజముగ నాకు
దర్శనం బొసఁగిన దానఁ జేసి

మానవత్వము గల్గె; మఱియు రాచఱికంబుఁ
బ్రాపించె నిప్పు డప్పగిది నన్నుఁ
గరమున స్పృశించినంతనఁ గలుషవితతి
దొలఁగ బాములు సెల్ల శ్రీనిలయునెలవుఁ
జేరఁగల నన్న నిత్యసంసేవనమునఁ
దొడరు సుకృతంపుమహిమము నుడువఁ దరమె?"

అన విని నారదుండు కడు హర్షము సెంది "సుఖింపు" మంచు దీ
వన లిడి బిడ్డకుఙ్; మగుడ ద్వారకకుఙ్ జని, "కృష్ణ! నందనం
దన! దయఁ జూచి నన్నుఁ జరితార్థునిఁ జేసితి: నైన నీదువ
ర్తన మరయంగ నేరనికతంబున ము న్నటు సంశయించితిఙ్.

పిలిచినఁ బల్కకే- మనసు పిల్చినఁ బల్కెదు: కన్నుదోయికిఙ్
వెలియయి-లోనికన్నులకు విం దొనఁగూర్చెదు: నీనసించుతా
వులు పరిపూతముల్: సుగుణభూషణ! భక్తమనోగృహంబులఙ్
వెలయుదు: వన్యదేశములఁ బేరిమిఁ జూపవు-భక్తమోహనా!

నెలకొని పూన్కితో, హృదయనీరజపీఠమునందు బుద్ధినా
త్తు లనెడు పగ్గముల్ కడఁకతో సవరించుచు, నింద్రియాశ్వముల్
మెలపునఁ దోలుచుఙ్ రిపుల మించినయూపసారి నిగ్రహించి నీ
విలసనముల్ మది న్నిలుప వేఁడి, భజింతును బాగ్గసారథీ!"

అనుచుఁ గృష్ణునిఁ గీర్తించి, యాకసమున
కెగసి, మహతిని నుతిఁజేసి, యగణితముగఁ
గృష్ణచరితంబుఁ బాడుచుఁ—దృష్టుఁ డగుచుఁ
జనియె—సురవరాని లోకసంచారి యగుచు.

# తృప్తి.

తృష్ణాదూషితమై జగం బడల, నాస్తిక్యంబు వ్యాపింప, ధ
ర్మిష్ఠుండై కలి మేర మీఱ, నిను( దుద్దీపించుచందాన-శ్రీ
కృష్ణాంశంబున నుద్భవించి జగతిన్ శ్రీకృష్ణచైతన్యు( డా
కృష్ణప్రేమను గీర్తనాత్తమగు భక్తిన్ జాటె నిండారగన్.

ఆతడు లోకమంగళమహామతి, దీర్థనిషేవణార్థమై
భూతల మెల్ల( గ్రుమ్మరుచు( 'బూరిని'( జేరి యొకప్డు డాపురీ
పూత రమాధినాథు పదదర్శనభాగ్యము( జూఱలాడి, సం
ప్రీతమనస్కు(డై తరలె( బ్రేమభరంబున మెల్లమెల్లనన్.

తొట్రిలుపదంబులను, బాష్పతోయ మురలు
కనుల, దేవాలయంబును గడచి కొంత
దవ్వు చనినంత "నోప్రభూ! యివ్విధుపున
నన్ను దయమాలి విడిచెదే?" యన్న యెలు(గు
సన్నముగ( గర్ణములు సోక( జకితు( డగుచు.

తటుకున వెన్కకున్ మఱలి, తా నపుడప్డె దూరమయ్యె-వే
సట యనకే రయంబున( బ్రసన్నముఖంబున దేవళంబుచెం
గటకును బోయి, కాంచి యతికార్శ్యశరీరుని( గుష్ఠరోగి నా
దట( గరపల్లవంబుల గదాధరు( డెత్తి యురాన నొత్తినన్.

ఆమహావ్యాధిబాధితు( డద్భుతముగ
దుర్భరంబగు రోగంబు తొలగ- శీర్ణ
కాయము క్షణములో వజ్రకాయ మగుచు(
బరమ తేజస్వియై మ్రొక్కి పలికె నిట్లు.

## ఛాయా దపతి.

పడసి యాత్మోపలబ్ధిఁ—దుందుడుకు నెఱుఁగ,
"కాత్మవ త్సర్వభూతాని" యనెడు సుద్ది
నుద్గవిడి జీవితంబున నూఁది, ప్రేమ
పులకితుం డుండె మున్నొక్క పుణ్యమూర్తి.

'అమరుల కసాధ్యమై యొప్పునట్టి శీల
మెట్టు లోకమర్త్యమాత్రున కెనయ వచ్చెఁ?
'జూత' మని యెంచి యింద్రుండు భూతలమున
కరుగుదెంచి పరీక్షించె నతని మిగుల.

అతఁ డిది సుంతయున్ దెలియఁ డచ్ఛహృదంబుజ కర్ణికాంతర
స్థితజగదీశ్వరున్ మననసేయుచుఁ ద్యాగమె రూప మెత్తె నీ
గతి భువి సంచరింప ననఁగాఁ దగి; యొప్పున కాదిపీఠమై
సతతముఁ దన్ను లోకమును జల్లనిచూపుల హాసరేఖలన్.

'సరి-యిది యద్భుతం' బని ప్రసన్నత నాతని మెచ్చి, కాంక్షితం
బరుదగుదానినైనఁ దన యంతకుఁ దానయి యీఁదలంచి, యం
బరమున నిల్చి యింద్రుఁ "డనవద్యుఁడ! నీవు స్పృశించినంత-దు
ర్భరమగు వ్యాధియైనను నివారితమౌ వర మిత్తు" నంచనన్.

"అది యటు లుండనిండు; జగ మంతయు నోమఁగ దైవశక్తి సం
పద తగియుండ, నాకు వరభారము లేల?" యటన్న మాని "నో
ప్పు దనర దైవమే జగముఁ బ్రోచును మానుషరూపుఁడై యటం
చుఁ దెలుపరే మహాత్ము? లగుచో మఱి దైవము వేరె యున్నదే?

ఏవర మేని దప్పక గ్రహింపు'' మటంచు సురేంద్రుఁ డన్న ''నో
పావనమూర్తి! నా కితరవాంఛ లవేల?—పరాత్పరుండవై కా
ర్యావహుఁడవై తలిర్పఁ?;- ఇతి తాపనభారము మీకుఁ జెల్లదే?
యీవరముల్ గ్రహించి—నను నీశ్వరుదారగుఁగా నొనర్తునే?''

అనుచుఁ బ్రత్యుత్తరం బీయ విని, మహేంద్రుఁ
''డో యి! వర మొకఁ డీయ నుద్యుక్తుఁడనయి
వచ్చితిని; గాన మహాత్మ వలదన; దొక్క—
వరము గ్రహియింపు మిచ్చెద వచ్చుదాని.''

అనిన నాపూజ్యుఁ డేమ గాఢ కక్కసముగఁ
దాను దెలియక జగదభ్యుదయముకొఱకు
సత్కృతు లొనర్చునట్టిల సతత మొక్క—
వరము నర్థించె; నంత దివస్పతియును.

అతనిలోకకల్యాణపరాయణతకు
మెచ్చి, యాతనిస్వనీడ యెచ్చ టెచటఁ
బరగు, నచ్చోటు లెల్ల సంపదలఁ బొదలి,
కోరికలఁ దీర్ప వర మిచ్చి చేరె దివికి.

అది మొదలూషరస్థలులు-నాతఁడు మెట్టిన సస్యసంపదల్
బొదలెడు వానినీడ యెటువోఁ బ్రసరించుటఁ; దత్ప్రభావ మా
సదయుఁ డెఱుంగకుండనె, వెసన్ సమయించుచు- వ్యాధులెల్ల, నె
మ్మది నొడఁగూర్చుచున్ బ్రజకు మంగళదాయకమై చెలంగినన్.

# స్థితప్రజ్ఞుఁడు

వేదపదార్థజాలము సువిస్తరబోధకమై చెలంగఁగా
బోదెలు కట్టినట్లు స్మృతిపుంజములన్ రచియించి, తత్త్వసం
వాదమునం దజేయుఁడయి ప్రస్తుతి కెక్కిన యాజ్ఞవల్క్యుఁడ
త్యాదర మొప్పఁగాఁ గఱపు మోక్షపథంబును శిష్యకోటికిన్.

తననుడివిన వేదార్థముఁ
దననడనడిఁ జూపునట్టి ధన్యుఁడు- ఛాత్రుల్
గొనకొని యర్థింపఁగఁ బ్రా
మినుకుల గూఢార్థ మెల్ల మెలపునఁ దెలుపున్.

సౌమ్యగుణశీలు, డాత్మజిజ్ఞాసు, లూర్ధ్వ
రేతసు లతనిశిష్యులు రేపు మాపు
నభ్యసింతురు శాస్త్రంబు; లందు జనకుఁ
డొక్కరుఁడు కర్మయోగి నా నొప్పుచుండు.

బలిసి యరిగాఁపులై భూమిపతులు గొలువ
జనకుపోలికఁ బ్రజలను సాకుకతన,
సార్థకాభిఖ్యుఁ డయ్యె నా జనకనృపతి
దమితబాహ్యాంతరారాతి ధర్మరీతి.

ధరణీభరమ్ము నౌఁదలఁ దాల్చియును రాజ్య
కాంక్ష నేరని మేటికర్మయోగి,
కడలేనిసిరుల భోగము లొందియునుగూడఁ
దగుల మెఱుంగని ధన్యజీవి,

బాహువిక్రమకళా పరిణతుండయ్యు శ
మదమాదిగుణములం బరగుసాధు,
తనసర్వమును దాన మొనరించియైనఁ ద
న్నాశ్రయించువారి నర్థించుపేద,
తోరపుంభక్తిజలములఁ దొప్పఁదోఁగి-
యాత్మయందున రమియించునట్టి భోగి,
సాధుసేవాభిరతి కొనసాఁగ ఘనులఁ
బూజ లొనరించి తనిసెడిరాజయోగి.

తా నొకపండితుండు నయి, దంభ మొకింతయు లేక, దేశికుం డానతి యిచ్చునంతయు నిజానుభవంబునఁ జేర్చి, యీశ్వర ధ్యానపరుండునై ప్రకృతియందుఁ బరాత్పరు నొందునట్లుగాఁ బూని కృతార్థుఁడై పరమబోధను మించెను రాజహంసయై.

'ఆ రాజన్యునిచిత్తవృత్తికిఁ గదుర్ హర్షించి, లోలోన దు ర్వారంబై యనురాగ ముప్పతిల సంభావించు- నుత్ఫుల్లమా స్యారాస్యంబున దేశికేంద్రుఁ' డని తచ్ఛిష్యాళి శంకించి, హా ద్భారంబౌ వగలన్ దలంత్రు తమలోఁ దా మిట్లు గూఢంబుగన్

'ఇందఱు యోగిచంద్రులు, జితేంద్రియు లిందఱు శిష్యు లుండఁ నందఱిలోన నీప్రభువు నంతలుసేయు గురుం డిదేమొ? యీ చందముఁ జూడ నీతఁ డిట శాసకుఁ డౌటఁ బ్రియంబు నూపు నన్ నందియ మాను; గాక యిల సాధ్యమె తేనికి యోగమార్గముల్'

స్వార్థపరతంత్రులై బుద్ధిజాడ్యమునను
బోగులు నరపాలు రేడ? యపూర్వమైన
జ్ఞానవిజ్ఞానదక్షులౌ సత్యశీలు
రెఱుఁగ రానట్టి తత్త్వంబు నెఱుఁగు టేడ?'

అని చర్చింతురె కాని యందొక రుపాధ్యాయుల్ సమీపించి - యే మని పృచ్ఛింపఁగ నేర; రైనను గురుం డవ్వారిభావంబులన్ గనె నంతర్ముఖుఁ డౌట; నంతటఁ దదజ్ఞాంతిన్ నివారింప నొ య్యనఁ జిత్రక్రియ యొండు సేసె నిజమాయాయోగవిస్ఫూర్తితోన్.

ఒకనాఁ డెప్పటిపోలె, నాశ్రమమునం దుత్కంఠతన్ వారు నై దికధర్మాపగ నోలలాడుతఱిఁ దోతెంచెన్ సధూమంబులై సెక లాకాశము నంటుచున్ బురమునన్ జిత్రంబుగా; నంతఁ గొం డొకవార్తాహరుఁ డేఁగుదెంచి పలికెన్ భూనాథునిన్ మ్రొక్కుచున్.

'అకట! నృపాల! రమ్యమణిహర్మ్యము లన్నియు బుగ్గి యయ్యెఁ; దా వకపురి పూరిపోలె నలుప్రక్కల మండుచు నుండె నయ్యొ! పా వకునకుఁ దృప్తి లేదు; పయిఁబొఱుచు ముట్టుచుఁ గాల్చుచుండె; నిం తకు క్షణ మాలసించిన వృథా యగునేమొ! ప్రయత్న మంతయున్.'

అన విని, యాజ్ఞవల్క్యమునియానతిఁ గైకొని, తేరిపై రయం బునఁ జని రాజు గాంచెఁ దనముంగల - దారుణమారణాగ్ని కిం ధనమయి రాజధాని మసనం బగుచుంటయుఁ, గాందిశీకులై తనవ్రజ తల్లడిల్లుచును దల్లికిఁ బిల్లకుఁ దప్పుచుంటయున్.

కొంపలు గూల రగుల్కొనుమంటలోఁ
        జిక్కి యల్లాడుచు స్రుక్కువారు,
"నుయ్యాలలోఁ బాప లున్నారు రక్షింప
        రే" యంచు నేడ్చి ప్రార్థించువారు,
మంచ మంటుకొనంగ మసలఁగాఁ జాలక
        యిట్టిట్టు కొట్టుమిట్టాడువారు,
నవదల రక్షింప నరిగిన, దూలంబు
        కూలఁగా 'హా' యని కూలువారు,

ముందు వెన్కల మంటలు ముట్టుకొనఁగ
బిట్టుగాఁ గూయివెట్టుచు నట్టు లిట్టు
ప్రాణ మఱచేతఁ బట్టుక పఱచువారు
నై పురంబు కరంబు సంతాప మందె.

నిటలాక్షుని కనుమంటలె
యిటువలెఁ జెలరేఁగె ననఁగ నెటు గన్గొన్నన్
చిటపట రేఁగుచు మంటలు
తటుకునఁ బుటమార్పసాగెఁ దత్పట్టణమున్.

తనప్రజ చెల్లాచెదరౌ
టను- గుండెలు దిటవుతప్పుటను గన్గొనుచున్
జనకుఁడు వారికిఁ జేవయు
ఘనకర్తవ్యమును గఱపఁగా నిట్లనియెన్.

'ప్రజలారా! యిటు చూడుఁ: డిట్లు పరువన్ బాగున్నదే మీకు? నే
ప్రజ వీక్షించి పరుల్ ననున్ గని స్థితప్రజ్ఞుండుగా నెంతు: ర
ట్టి జయశ్రీసముపేతులౌ ఘనులు గుండెల్ వ్రీలఁగా దిక్కు కొ
క్క జనుండనై వెడఁబాఱు మిమ్ము నేఁటు పల్కంబోలునో తెల్పుఁడీ!

దీనుల దరిఁ జేర్చుటయో
ప్రాణాశల నీడి యొరుల రక్షించుటయో
కానక– మీరే ధైర్యముఁ
బూననిచో మిథిల యింత బూడిద కాదే?–

అటు చూడుఁ! డాదెస నగ్నుల శాంతింపఁ
జేయఁ బ్రధాని కష్టించుచుండె;
నిటువైపు రాకుండునటుల సేనాపతి
శిఖిశిఖావళిని శిక్షించుచుండె;
నల్లదే–వహ్నుల నగ్నిమాపకదళం
బతికష్టపడుచుఁ జల్లార్చుచుండె;
వారదే–యువకు లావనితల– శిశువుల–
వృద్ధులఁ– బసుల– రక్షించుచుండి;

రాప్రయత్నము లన్నిట మీప్రయత్న
ములను జతఁ జేసి, యుత్సాహమునఁ గడంగి
మిథిల రక్షించి, లయకాలమృత్యుతాండ
వమును బోలునీయాపదఁ బాప రెండు!"

అనుచు మఱిమఱి చే వీచి తనప్రజలను
హెచ్చరింపంగఁ, జెదరిన హృదయములకు
బలము చేకూరినట్టులై వారు జనకుఁ
గాంచి మిథిలను రక్షింపఁ గడఁగి: రంత.

"అంతఃపుర మంటుకొనెన్"
"అంతంతట నిల్వఁ"-"డగ్ని నార్పుఁడు"-"నృపుఁడే
చెంతం గలఁడో తెల్పుం"
"డంతయుఁ జెయి దాఁటి పోయె" నన్నరవంబుల్.

వినవచ్చిన వెను వెంటనె
జనకుం డట వోయి కాంచె జ్వాలనంబున కిం
ధనమై పోవుచు నబలా
జనములతో రాణివాససౌధము కూలన్.

ఎట్టకేలకుఁ గొందఱు దిట్టలచట
సాహసించిరి స్త్రీలరక్షణముకొఱకు;
నెంత ఘోరము! మృతలైరి కాంత లెల్ల;
నధిపు పట్టపుదేవియు నందుఁ గలదు!

వెన్నెలచిఱునవ్వులతోఁ
గన్నులఁ దెలికాంతితోడఁ-గమనీయరుచి
స్విన్నముఖి రాణిదేహము
మన్నై మసియౌట నచట మహిపతి గాంచెన్.

నిమిషమాత్రమైన నిశ్చలదృష్టితో
రాజు చూడలేదు రాణి; నంత
యాజ్ఞవల్క్యాశ్రమాని యచటికి నేతెంచె
శిష్యసంఘ మతనిఁ జేరి కొలువ.

అందు సతీర్థ్యులు కొందఱు ద్వైన్యవి
పాదమేఘంబు లాస్యముల నలము
కొనఁగఁ బల్కిరి; తేర్చి; రనునయించిరి; 'కర్మ
మేనాఁటికిని దప్ప రాని' దనిరి:
మఱికొంద ఱగ్నిప్రమాదకారణ మేమి?
యుద్యోగు లెటు వోయి యుండి? రనుచుఁ
బ్రశ్నలఁ గురియించి పరిజనంబులతోడ
గుసగుసల్ వోవుచు గుములు గూడి;

'రివిపత్తును దప్పించి నృపునిఁ జేర్ప
కున్న మనతపఃఫలముల నెన్న నేల?–
రాణి నిప్డె బ్రదికించి రాజధాని
శోభలను బొందఁజేతుము–చూడుఁ' డనిరి.

ఒకచిఱునవ్వె యెల్లరకు నుత్తరమై చనఁ జూచి మైథిలుం
'డకట! మహాత్ములార! తమయంతటివారలుగూడ మాయతోఁ
బ్రకృతిని గానుపించుకొని వట్టిభ్రమల్ బడుచో మఱెట్టిచిం
తకు గురియౌచుఁ బ్రాకృతులు తాపములన్ నశియింతురో కదా!

జగతిఁ గానుపించు సకలంబు శాశ్వత
సత్య మంచు నమ్మఁజనునె జనుఁడు?
స్వప్నమందుఁ గనిన వస్తువు నిత్యమే?
మనసు చేయునట్టి మాయ గాక!

చిత్తమె— హేతువు సకలో
త్పత్తికి, లయకారణంబు: ప్రాజ్ఞులకుఁ ద
ద్వృత్తిని దెలియ నశక్యము:
చిత్తమునకు మించి మాయ చెలఁగునె యెచటన్?

ఆజ్యధారల హుతవహుం డతిశయిల్లు
కరణి విషయేచ్ఛలను దృప్తిపరచు టెట్లు?
మనసు— దరి లేక భీకరమకరసర్ప
సంకులంబైన జలరాశిసరణి దోఁచు.

మనసు నశియింపఁ గర్మయు మాసిపోవు:
మనసె తనమాయ నీశ్వరు మరుఁగుపరచు:
కనుకఁ బరమార్థతత్త్వచోదనకు మున్నె
మనసు నరికట్టఁగంటి, నెమ్మదిని గంటి:

కాన మిథిలయు గాల్చియుఁ గలుగునాఁడు
తగుల మింతయు లేదు నా తలఁపునందు:
చింత యావంతయును లేదు— కాంత వోన
నగర మిటు కాలుచున్నను నాయెడంద.

పాలకుఁడ నౌటఁ- బ్రజలయాపదలఁ బాప
వలసి- బాధ్యత నెఱవేర్ప వచ్చి యుంటి:
రాజకర్మంబు నెఱపుధర్మంబు దక్క-
నంట నేరదు నాహృదయంబు నెద్ది.'

జనకుఁ డిటుల్ వచించిన-ససంభ్రముఁలౌచు మునీంద్రు, 'లౌర! యీ తనిమన సిట్టిదంచు, దృఢధర్మము పూని విదేహముక్తిఁ బొం దిన ఘనుఁ డంచు నేరక యనింద్యచరిత్రుని దేశికోత్తముఁ మనమున సంశయించితిమి-మాయవివేకఫల మ్మఘమ్మనన్.'

అని పశ్చాత్తాపంబును
గనువారల మునులఁ గాంచి కరుణను గురుఁ డి
ట్లనుఁ "జింతం బాయుఁడు; మీ
మనసునఁ గల సంశయంబు మానెనె" యిపుడేఁ?

తలఁచితి రొక్క-తీరు నను 'ధారుణినాథునిఁ బక్షపాతదృ ష్టులఁ బరికింతు' నంచు: 'నతఁడున్ మఱియెక్కుడె మాకటంచుఁగొం దలపడుచున్న మీకు నొకధర్మము మైథిలుగొప్పఁ జూపఁగాఁ దలఁచి యొనర్చితిన్ విలయదావకృతాంతవిలాసలాస్యముల్.

నిజముగ నాయెడందఁ గననేర్తురె భేదము? మీసతీర్థ్యులం దు జనకుఁ డెట్టివాఁడో మఱితూఁచుఁడు మీ మదులందుఁ: బట్టణం బు, జనులు, రాణివాసమును బూర్వవిధమ్మున నుండెఁ జూడుఁ! డిం కఁ జనుద మాశ్రమంబు" కనఁగా మునివర్యులు-మోదముఁదమ్ములన్

# చింతనము.

అస్మదనుతాపరూపమహాస్రవంతిఁ
గడిగి, హృదయమ్ము నిర్మలగగనమట్లు
చేసి, భవదీయచరణరాజీవయుగము
చెంత నిల్పుట కెంతో యాసింతుఁ గాని—
ఐహికాశయమతిఁ దడియాడెఁ గనులు—
ఎట్టులఁ దరింతు? నీబ్రతు కేటులఁ బుత్తు?

కంటకావృత దుర్గమకాననముల
నేను గాఢాంధకారమం దేఁగుచుండఁ—
జూపెదవు త్రోవ భవదీయశుభ్ర తేజ
మునను; గన్గొనలేక నే మున్ను పోవు
దారిఁ జరియింతు నేగతి దరికిఁ జేరి
నీదుపదముల చెంత నే నెలవు కొందు?

ఈవు ప్రేమార్థి వౌచు నిల్లిల్లు దిరిగి—
కడకు నాయింటిముంగిటిగడప నిలిచి—
చేయి సాతువు: నా శుష్కజీర్ణహృదయ
కుహరమును జూప సిగ్గునఁ గ్రుంగి, కనులు-
ధరణి ఘర్మాంబువుల సించితం బొనర్పఁ
జెంత నిలుతును నిర్జీవచిత్రమట్లు.

పదవుల, ననంతభోగసంపదల నిచ్చి-
హాయిఁ గూర్చుండి జీవితయాత్రఁ గడపు
మంటి: నది యేమొ? యింటింటి కరిగి భిక్ష
మడుగ వాంఛింతు: దీని నే మందు? నాదు
కర్మమా? యేమొ?- నీయాజ్ఞఁ గా దనందు!

ఆలును బందుగుల్ కొడుకు లాపదవేళఁ బరిత్యజింతు: రే
వేళను నీడవోలె వెనువెంటనె యుందువు రక్షకుండవై
చేలతినాన రెంటఁ గల భేద మెఱింగియు వీని నమ్మి, నా
యేలికవైన నిన్మఱచు టేమిది కర్మము?- దీనబాంధవా!

సోదరుఁ డొక్కఁ డాఁకటికి సోలఁగ; నొక్కఁడ లేమి పెంపునన్
సోదరి వస్త్రహీనయయి స్రుక్కుచు నుండఁగ—జాలిఁ జెంది యీన్
దాఁ దినఁ, గట్టఁగా మిగులుదాని నొసంగఁగఁ జేయి రాదు: క
ష్టా! దయమాలి- నీచుఁడగుటన్- మది స్వార్థము తాండవించుటన్.

నీకోపం బిసుమంత లేదు, ప్రభు! నే నింద్యాస్పదున్ గాక- యే
కాలంబందెది యుష్ణ, మయ్యది యొసంగన్—గష్టసంఘమ్ములన్
దూలింపన్-దగ వేచియుండెద: వశక్తుండైన నే దేనికో
తూలంబోయెద-దిక్కులే దనుచు నేస్తున్ మీఁద మోహంబునన్.

రాకయి శాంతిఁ దక్క- పతనంబున నభ్యుదయంబునందుఁ గ-
న్నాఁకయి యుండ నుండఁ గదు నజ్ఞత-భీకరకాళరాత్రి- నే
కాకివలెన్ భయంబున వికావికలై హృదయంబు విచ్చిపో
నాకులతన్ దపింతు నిను నాత్మఁ దిరంబుగ నిల్ప లేకయే.

స్వీయధిషణాతిశయమున–విఱ్ఱవీఁగి
మానవుఁడు సృష్టిమర్మముల్ గానఁ దొడరి–
విత్తునకు ముందు వృక్షమొ? – వృక్షమునకు
విత్తనము ముందొ? తెలియఁగా నెలికలఁబడు.

భాసురకాన్తిపుంజ మొకవంకఁ దమశ్ఛటఁ బాపి–తెల్వికిన్
బాసట యౌచు–సంసృతివిపాకముఁ గూర్చెదుత్రోవఁ జూపఁ; బే
రాసలు గల్గఁ జేయుచుఁ–బరార్థ్య మపావృతముం బొనర్చు–మా
యాసముపార్జితాకృతి, యయారె! యగమ్యము లీ యుదంతముల్

జలధితరంగముల్ జలముసత్త్వమునం దొకఁడయ్యు, భిన్నభం
గులఁ గనుపట్టుపోల్కి– భవకూపగతంబగు నాత్మయుఁ భవ
ద్విలసితతేజమే యని వివేకులు బోధలు సేతు: రైన నీ
సిలుగులఁ జిక్కు– టేల–మఱి జీవులు నీవయి గ్రాలుచోఁ? బ్రభూ!

జనుఁడు– సతి యని, సుతు లని, తనకుఁ గూర్చు
బంధు మిత్రు లటంచు విశ్వాస ముంచి–
తద్వియోగానలంబునఁ దప్తుఁ డగుచుఁ
దన్నుఁ గాంచి, పెంచినతల్లిఁ దలఁపలేఁడు!

స్వేచ్ఛకై కొట్టుకొనియెడు జీవి– శృంఖ
లములు బంగారువైనను– శమముఁ గనఁడు–
హేమమయపంజరంబున నిడినమాత్ర
ఖిన్నతను బొందకుండునే కీరరాజు?–

తన కిచ్చినంతలోఁ దనివొంద కెన్నెన్నొ
కుత్సితవృత్తితోఁ గోరుచుండు;
కోరినవి లభింపఁ గూర్మి సంతోషించు
దైవ మెంతటిమహోదారుఁ డనుచు;
దాత కాఁ డీతఁడు దబ్బఱ యని దూఱుఁ
దన కలభ్యంబైన తరుణమందు;
తాను తెన్నుఁ గనక తగులాట మందెడు
దుష్టమనఃక్లేశదోషమునను—
ఇంతియే కాని, ప్రభుఁ డెంత యిచ్చె, దానఁ
దృప్తిఁ గని, కొంత యితరుల కీయఁ గలిగి,
నిర్మలుఁడు కానిమనుజునికర్మ మేమొ?
సకలహృదయార్తిహరణ! యోసాధుశరణ!

కుమతులు భోగవస్తువులకుఁ దపియింతురు: సజ్జనుల్ భవ
ద్విమలపదాబ్జసద్మవసతిన్ గన నెంచి తపింతు: రిర్వురున్
సములు తపించుటన్: తవిలి చచ్చుచుఁ బుట్టుచు నుండు నొక్కఁ; డై
క్యముఁ గనఁజాలు నీపదమునందు మఱొక్కఁడు— భేదమింతియే.

మృదులతరాచ్ఛభావముల— రేకులు విచ్చినభక్తకోటిస
ద్హృదయసరోజపాళి వసియించెదు నీవు— కృతఘ్నరాక్షసా
స్పదములు-లోభమోహమదసర్పసమాకులితంబులైన దు
ర్హృదయగుహాంతరాళముల నించుకయైనఁ గనంగఁజాలుదే!

సకలకళాప్రపూర్ణబహుసంశ్రితసర్వరహస్యమా-భవ
త్ప్రకటిత సృష్టికావ్యరసపాన మొకించుకఁ జేసి, మానవ
ప్రకర మొనర్చు కావ్యనికరంబు నుతింపఁగ నేరఁ డైన, నీ
ప్రకటితదివ్యశక్తి వివరంబులరంగులఁ జూడ నేర్తునే?-

తడయక, వేగిరింపక, నిదానము నై నిజకార్యదీక్షలోఁ
జెడుగును, మంచి యారసి, విశిష్టపథంబునఁ బోవుసాధకుం
డడరెడు నంతె కాని-యెవ్వరై యెటు పల్కిన నట్లు సేయఁ జూ
చెడునతఁ డన్నిటన్ జెడి నశించును సద్గతిఁ గానకుండుటన్.

అరయక ముందువెన్కలు-జయంబును గోరి- దళాధినేత యే
వెరవున నాజ్ఞసేయు, నటు వీఁగక వైరి నెదుర్చు యోధునా
చరణము వోలె- సాధకుఁ డసంశయవృత్తి గురూపదేశముల్
శిరమునఁ దాల్చి షడ్రిపులఁ జిన్న నెదిర్చి, జయింపఁగావలెన్.

ప్రియుఁ డూరఁ దనమనఃప్రియునికి విన్పించుఁ
బికపత్ని సుస్వరప్రేమగీతి,
నకలంకమై స్నిగ్ధమై తనర్చెడు శిశు
వులమోములను వెల్గు తెలినగవుల,
సంతానమును గాంచి, సమ్మోదభరితయై
యనురాగసిక్తయౌ జననియెడఁద,
స్వార్థచింతన మన్న పలుకెఱుంగని త్యాగ
శీలురవితరణశ్రీలహారిని,

# ఆత్మబోధ.

సంశయాత్ముఁడు:- నాదునిస్సారజీవననాటకమున
నెంతకును రక్తి కల్గ దిదేటి శ్రమము?-
అప్రధానంబు, నజ్ఞాతమైన జన్మ
మెత్తినా నోటు! ప్రత్యేకహీనభావ
కలుషితంబయ్యె నామది: యలవి కాని
చిత్తము నెదుర్ప నేల? విశృంఖలముగ
విషయసుఖదివ్యవాహినీవేగమునను
గొట్టుకొనిపోయి, యందె యగోచరుండ
నైనమాత్రానఁ దొడరెడునహిత మేమి?-

  

విశ్వాసి:- భ్రాంతిఁ జెందకు, మనస! విశ్వాస మెడలి-
నేనె సర్వస్వతంత్రుఁడ, నేనె కర్త
కార్యముల కంచుఁ దలఁచుటఁ-గలిగె నిట్టి
విభ్రమము సత్యదూర మావికటతర్క-:
మే జగత్కర్త ని న్నిట్టు లేనిమిత్త
ముర్వి నిల్పెనో?- తత్సిద్ధి నొప్పరికము
సేయకే నిన్ను సాధించుఁ జిత్రగతులఁ;
గావున ననర్థదం బహంభావ మూర్చి,
యతని కర్పించి సర్వస్వ మతనికొఱకె
మనుట నేరిచి శాంతిని గనుట మేలు

పాపి! కృశియింప కోయి! యపారమైన
జననికరుణాలహరి నీచ ఘన విభేద
మెఱుఁగ; దిటు చూడు! మెటు ప్రవహించు నందు
నఘము లడుగంట ముగ్గి ధన్యతను గనుము.

అలసుఁడా! యెన్నినాళ్లిట్టు లన్యచింత
లేక నిదురింతువు?- వీయవివేక మేమి?-
జీవితార్థము వృథగ నశింపకుండఁ
దెలివిఁ గనుమోయి! కన్నులఁ దెరువుమోయి!

భావిపదవులఁ గూర్చి సంపదలఁ గూర్చి
పరమసంతోషమున నోటఁ బలుకు లేక
కలవరించెద వేమేమొ కలలఁ గాంచి;
కలలు కల్లలు కాక నిక్కములె- చూడ?

తనప్రేమాల నొకమాఱు వినిపింతువా, పాప
ములనెల్ల క్షమియించు మోక్షదాత,
తన్ను దూషించినఁ దగుమార్గమునఁ ద్రిప్ప
సతము యత్నించెడు శాంతమూర్తి,
వరముఁడై ప్రోవఁ దగ మఱచు కృతఘ్నుఁడౌ
జడున కేఱిఁగించు సాత్వికుండు,
తా నొసంగినదానఁ దనివి సెందక, యాస
పడెడుమూర్ఖున కిచ్చు పరమదాత,

# విన్నపము

బిరుదు కొన్నావు, ప్రభు! నీవు పేదజనుల
"కొంగుబంగార" మని యిటు కోపగింప
బ్రతుకుదెరు వెద్ది—మాబోఁటి బడుగులకును?
కంచెయే చేను మేసినఁ గలదె—దిక్కు?

విషయవాసన తెవలోన వీచి రేఁగు
పెనుదుమారమ్ములో నిన్ను వెదుక లేను:
వగచి కురిసెడు కన్నీటివానలోన
నణఁగిపోనిమ్ము— పాపదవాగ్నికీల.

దోహదాభావమున నెదఁ దోఁచినట్టి
పూజ్యభావంబు లంతంత బ్రుంగిపోయె—
పల్లవించు మదాశయపాదపమ్ము
మ్రోడువడె; నీపదస్పర్శ మొలక లెత్తు!

ఉదయం బాదిగ మేలు సేయుటలు నీయుల్లాస; మాసత్కృతుల్
తుద కాత్మన్ బరికించి ప్రేముడి నుతుల్ తోడ్తోడఁ జెల్లింప కం
గద నోలాడి కృతఘ్నభావము బయల్ గావించుటే మత్కృతుల్—
సదయా! నీకృప కాక వేఱు కలదే? శాసించి నన్ బ్రోవఁగన్.

అనఘా! నాయఘముల్ స్మరించుకొని, నీ హర్మ్యంబునన్ జేరి, లో
నను బాదం బిడలేక యన్యులు భవన్నామంబుఁ గీర్తించి మ
న్నన లందం గని, నాయభాగ్యదశకున్ నైరాశ్యముం జెంది వే
దన రోదింతును: జేర్చుకోవె, పతితత్రాణా! భవత్సన్నిధిన్.

ధృతి సెడి యెన్నిమార్లో నినుఁ దిట్టితిఁ గష్టదినంబులం దవ
జ్ఞతఁ; బ్రభుఁ డుండెనా యనెడు సంశయవృత్తిఁ జరించితిన్; మదిన్
వెత యిపు డూఁచినైనఁ బలవించెద; నీపలుగాకినైనఁ గృపా
మృతరసధారలన్ గురియవే! విషయేచ్ఛల మాన్పవే! ప్రభూ!

శిక్షాపాత్రుఁడ నైతి నంచు మదిలోఁ జింతించుచున్-భక్తి మ
ర్భిక్షం బాటఁ-గృతాఘశోషణము, మనోభీష్టప్రదాతన్, నినున్
రక్షింపన్ మొఱవెట్ట నోడి, విగతప్రజ్ఞుండనై-నైభవా
పేక్షం గుంది, దురాశలన్ జెడితి: నన్ వీక్షించి, రక్షింపవే!

నీపదపాంసువుల్ గొని, యనిర్వచనీయసుఖానుభూతిఁ జేరి, వి
క్షేపముఁ బాసి, యార్ద్రమగు చిత్తమునన్ నెలకొల్పి-నీలస
ద్రూపము;-నిత్య మర్చనలతో నినుఁ దృప్తునిఁ జేయ నెంతు: నీ
శ్రీపదపద్మసన్నిధిని సేవకుఁగా నను నిల్పుకోఁగదే!

మృగతృష్ణన్ బడి పాఱు లేడిక్రియ-బూమెన్ గొన్న భోగాదులన్
దగులన్ బోయి, నిరాశఁ జెందితి: ననర్థంబైన దైన్యంబు ప్రే
రగుఁ: బ్రేమామృతపూరమా! కనటు వో నవ్యాజకారుణ్యమున్
దగ వర్షించి కృతార్థుఁ జేయఁ దఱి కాదా! దీనసంరక్షకా!

కుచ్ఛితమనంబు గోర్కెలచిచ్చుఁ దవుల
దెరువు దోఁపమి వెతఁ గుంది దివులు సెందు
నీయవిశ్వాసి, నవివేకి నేమర వని-
దొడ్డదొర వని-ప్రభు! నీకు దోయిలింతు.

కవి యసంతవసాలఁ జేపృతి శ్రోవయుఁ దెన్నుఁ గానకే
దేవ్రుఁ దెంచి నీసహజదీన వరూపరతంత్రవృత్తి సం
భావితఁ జేసి, నేస్వయముఁ బ్రబ్బినగాఢతమస్సుఁ జించి, కా
ర్యానపథుఁ జేయునట్టి భవదాకృతి నేమనఁ జెల్లు? సద్గురూ!

కటికి చీకట్లలోఁ గన్ను గాన కెంత
తడవియును దెన్ను తోఁపమి—నడలి—కొఱవి
దయ్యములకెల్లనీడలఁ దవిలి— సోలసి—
పాలిపోయిన మ్మెల్లియుఁ గ్రుంగఁదీయ,
నడుగు తడబడ దిక్కఱి, యటమటించి,
యంతలోఁ దోడునీడగ ననుసరించు
నిన్నుఁ గని-గమొక్క మెఱపున నెయ్యెడ- వని
సోల్చుకొంటిఁ: దదాది యపూర్వ ధైర్య
సాహసంబులు దనర నీసాయ మొకటి
నూఁతగాఁ గొని పయనించుచుంటి— మఱల.

ప్రేమ తోలుకాడఁ బఱితుఁ బిలుచునీదు
పలుకుపసం దెంత మధురిమన్ చిలుకునోయి!
మాహాత్మ్యమున నిన్నుఁ గాదని, మమత నలసి
మసలునంతఁ జేరఁ దీయునీమాలిమి, కహో!
ప్రకృతి పులకరించి తురిమెఁ బ్రసవవృష్టి!

నీ యుదారాతిశయమున—నన్నుఁ జేర
రమ్మనుచుఁ బిల్వఁ జెల్లును—ప్రభూ! నీవుఁ—
గాని, యొకమారు మత్కృతకలుషవితతిఁ
దలఁచి హృదయమ్ము భయమునఁ గలఁగి పోవు:
దివ్యపురుషుల కైనను! దేవ! నాకు
నలవికానట్టి నీధామ మధిగమింప
వెఱతు: నగుటను దీనత వేఁడికొందు,
నీదుదాసానుదాసుల పాదసేవ
యను మహాభాగ్యమున నన్ను మనఁగ నిమ్ము!

తనదు శేముషి, యోగ్యతఁ దా నెఱుంగ
కారటించుట దక్క, యన్యాశ్రయమున
నక్కఱలు దీరి, నిర్లిప్తుఁడౌ శిశువుగ
చందమున నిన్ను జననిఁగ, సద్గురునిఁగ
నెఱఁగి సుఖియింతు నీయండ నిలిచి, తండ్రి!

న న్నొకదుష్టవర్తను ననాదృతిఁ జూడక చేరఁ దీసి, ద
ర్పోన్నతి నాయొనర్చిన మహోన్నతపాపము ద్రుంచి-యస్మద
భ్యున్నతికై నిరంతరము పూని శ్రమించెడి నీపరోపకా
రోన్నతి కంజలించెద, గురూత్తమ! భక్తజనావనోత్సవా!